# మనవిమాటలు

మౌలికతను మదింపు వేయడం కష్టమే. దానిని మదింపు వేయడానికి సూక్ష్మతర పరిశీలన, కొద్దిగా ఔదార్యం ముఖ్యాతిముఖ్యమైన అర్హతలు. అప్పుడే ఆ మౌలికత ఏ రూపంలో ఎంత మోతాదులో ఉందో గుర్తించి గౌరవించడం సాధ్యమౌతుంది.

విశ్వసౌందర్యం మన కళ్లెదుటే వేయిరేకులుగా విరుస్తుండడం చూచిన తర్వాత కూడా మన కల్పనలు, జల్పనలు మౌలికమైనవనడం వెర్రి కాదూ? ఉషస్సును తిలకించి మన కళాకారుల కుంచెలు వెలవెలబోవూ? అనవరతం ప్రకృతి వినిపించే మధురస్వనాలకు మన గాయకుల గొంతులు గడ్డకట్టిపోవూ? కాలం తెలిపే కరకు సత్యాలకు మన కవుల, ద్రష్టల దృష్టి జిగేలు మనదూ? అనుక్షణం, అనులిప్తం పుట్టుకువచ్చే ప్రాణికోటి మన శాస్త్రజ్ఞులకు సవాలు కాదూ? క్రమం తప్పక తిరిగే గ్రహవారం, శింశుమారం మన పరిపాలకులకు పరీక్షగా లేవూ? ఇలా చూస్తూపోతే, అంతా అనుకరణమే, అంతా అనురణనమే, అంతా అనుసరణమే.

కాని, ఆ అనుకరణంలోనే ఉంది స్వీయకరణం; ఆ అనురణనంలోనే ఉంది స్వీయరణనం; ఆ అనుసరణంలోనే ఉంది స్వకీయసరణం. ఈ అనుశీలనం సాహిత్యరంగానికి, అందులోను ఈ శతాబ్దానికి మాత్రమే అన్వయించి నేటి కొన్ని పాత్రలను పరిశీలిస్తే వాటిలో పాతపాత్రల పోలికలు, చాలికలు కనిపిస్తాయి. అంతమాత్రాన అవి మౌలికాలు కాకపోవు. గిరీశంలో శకారుడు గిరికీలు కొడుతుంటాడు. మధురవాణిలో వసంతసేన వాణి వినిపిస్తుంది. ప్రతాపరుద్రీయ యుగంధరునిలో కథాసరిత్సాగర యౌగంధరాయణుడు, భాసుని యౌగంధరాయణుడు భాసిస్తారు. అంతమాత్రాన ఇవి వాటికి నకళ్లనగలమా?

ఇక పరిశోధనరంగంలో ప్రతి సందర్భంలోను అభూతంగా ఉన్న కొత్త విషయాలు పుట్టుకురావు. తనవరకు తెలిసిన విషయాలను పరిశోధకుడు నూతన పద్ధతిలో క్రోడీకరించడమో, క్రోడీకరించిన విషయాలను నూతన దృక్పథంతో వ్యాఖ్యానించడమో, సమన్వయించడమో కూడ మౌలికమైనవే. డబ్బు విలువ సంగతి మానవజాతికి కొత్తదా? "అర్థోస్తు నః కేవలం యేనైకేన వినా గుణాః తృణలవప్రాయాః సమస్తా ఇమే" అని భర్తృహరి రెండువేల యేండ్లనాడే తెలిపాడు. కాని, దానిని కొత్తపద్ధతిలో పరిశీలించి నూతన సిద్ధాంతాలను ఆవిష్కరించి అపూర్వార్థిక వ్యవస్థలకు దారిచూపారు పలువురు.

కవి తను విన్నది, కన్నది, అనుభూతి పొందినదీ కల్పనా భావనా సాధనలతో రంగరించి కవితగా తీర్చిదిద్దితే, పరిశోధకుడు తను క్రోడీకరించినది తర్కానుగతం చేసి పోతపోస్తాడు. కళాకారుడు కన్నదే ఒరవడిగా కైవారం చూపి కళకు రూపు కల్పిస్తాడు. అదే అనుకరణ, అదే మౌలికత; అదే అనురణన, అదే మౌలికత; అదే అనుసరణ, అదే మౌలికత.

కనుకనే, మౌలికతను మదింపు వేయడం కష్టం.

**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.**

# భారతి

## ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | | కాజువల్ | కాంట్రాక్టు |
|---|---|---|---|
| 4 వ కవరు పేజి | | | |
| 2 రంగులు | ... | రు. 125/- | రు. 100/- |
| ఒకే రంగు | ... | రు. 100/- | రు. 90/- |
| 2 లేక 3 కవరు పేజి | ... | | |
| ఒకే (నలుపు) రంగు | ... | 90/- | 75/- |
| లోపలి పేజీలు | ... | | |
| పూర్తి పేజి | ... | 70/- | 60/- |
| అర్థ పేజి | ... | 35/- | 30/- |
| పావు పేజి | ... | 20/- | 15/- |

ప్రత్యేక స్థానములకు 25% అదనం.

సం॥ నకు వరుసగా 12 ప్రకటనలు చేయువారికి కాంట్రాక్టు రేట్లు వర్తించును.

* కవులు, కళాకారులు, రచయితలు మొదలైన వారి ప్రకటనలు ఒకకాలం ఇంచికి తేపకు రు. 2/- చొప్పున ప్రకటించబడును.

## చందా వివరములు

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | ... | రు. 12-00 |
| 6 మాసముల చందా | ... | రు. 6-00 |
| విడి ప్రతి | ... | రు. 1-00 |

మేనేజరు, భారతి,
మద్రాసు-1.